# జమదగ్ని

రచన:

పూడి వేంకటరామయ్య

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:
శ్రీ ఎమ్. లక్ష్మీనారాయణ, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1985

T. T. D. Religious Publications Series No- 284

SRĪNIVĀSA BĀLABHĀRATI - 46
(Children Series)

JAMADAGNI
by Pudi Venkataramanan

*Chief - Editor*
Dr. S. B. Raghunadhacharya

First edition: 1985
Copies : 10, 000
Price : 1—00

***Published by :***
Sri S. Lakshminarayana I.A.S.
EXECUTIVE OFFICER
Tirumala Tirupati Devasthanams
Tirupati.

Art: PĀṆI

**Printed at :**
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

అల్లారు ముద్దుగా పెరిగే అందాల-బాలల అద్దాల్లాంటి మనసులు ఎంతో నిర్మలమైనవి. వాటిముందు మనమెలాంటి సంస్కారాలను నిలిపితే అవే ప్రతిబింబిస్తాయి. చెరగని ముద్రవేసిన ఆ సంస్కారాలను వాళ్ళు భద్రంగా జీవితమంతా దాచుకుంటారు. భావిభారత పౌరులైన వారెంత సంస్కారంతో పెరిగితే, ఈ దేశాన్ని అంత చక్కగా తీర్చిదిద్దగలుగుతారు. కనుక మన సంస్కృతిలోని గొప్ప దనాన్ని, భారతజాతికి పెట్టని అలంకారాలై ప్రపంచాన్ని అలరించే మంచిగుణాలను వాళ్ళకు ఉగ్గుపాలతో నూరిపోయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎన్ని విద్యలు నేర్చినా, ఎన్నెన్ని రంగాల్లో లబ్ధ ప్రతిష్ఠులైనా ప్రజల్లో ఈ సంస్కారం కొఱవడితే ప్రమాణాలు పడిపోయి జాతి అంధకారబంధురమౌతుంది. అందుకే మనదేశంలో పుట్టి, ఏదో ఒక ఆదర్శానికి అంకితమై మనకు గర్వకారణమైన మహాపురుషులు, మహాపతివ్రతల కథలు చిన్నారిపాపలకు అందు బాటులో ఉండేటట్లు చేయడానికే ఈ ప్రయత్నం. ప్రాచీన భారతీయుల మహత్తరాదర్శాలను పరోక్షంగా తెలియజేయడమే ఇందులోని ముఖ్యోద్దేశ్యం.

తిరుమల తిరుపతి దేవస్థానం ఈ సంకల్పంతోనే 'శ్రీనివాస బాలభారతి' అనే పుస్తకమాలను చిన్నపిల్లలకోసం ప్రకటిస్తున్నది. 'మీరు బాలభారతి అన్నా మాకు, మా కుటుంబంలో అందరికీ ఉపయోగిస్తున్న' దంటున్నారు చాలామంది పెద్దలు. తాము చదివి తమపిల్లలచేత చదివిస్తే కొంతకు కొంత మా ఆశయం నెరవేరుతుంది.

ఈ బాలసాహిత్యాన్ని చక్కగా తీర్చి దిద్ది, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికకు సహకరిస్తున్న రచయితలకు, కళాకారులకు నా ధన్యవాదాలు.

ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరు వడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నాకర్తవ్యం' అని ప్రతిబాలుడు, బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకొంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్రవ

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. అహా! మనమెంత అదృష్టవంతులం! మనవెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్ళను అర్థంచేసుకోవడం, వాళ్ళ చరిత్ర మననంచేసుకోడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ము తుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

నిండుమనస్సుతో మీ కిదే మా స్వాగతం!

క్రోధన
9-9-1985

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

ఆత్మమాయతో అవతరిస్తారు అవతారపురుషులు. తమ అవతారానికి దేశాన్ని కాలాన్ని, ఎన్నుకున్నట్లే తల్లి దండ్రులను కూడా ముందే ఎన్నికచేసుకుంటారు. దశావతారాలతో అశేషజన జీవనవాహినిని అధర్మం నుంచి, అన్యాయంనుంచి, కాపాడిన ఆదిదేవుడు తన ఆఱవ అవతారానికి అన్నివిధాలా తగిన జననీ జనకులను ఎన్నుకొన్నాడు. బ్రాహ్మక్షాత్ర తేజస్సులకు మేలుకలయిక ఏర్పడింది. అది లోకకల్యాణానికి నాందీవాక్యం పలికింది. "ఇదం బ్రాహ్మమిదం క్షాత్ర" మని వీరగర్జన చేసిన విష్ణుభగవానుడు క్షత్రియాధములను చిత్తు చిత్తు చేశాడు. ఒకసారి కాదు; ఇరవై ఒక్క సార్లు. 'సెభాస్' అనిపించుకున్నాడు.

అంతటి మహావీరునికి జనకుడు కాగల్గిన ఈ మహానుభావుడెవరు ? అటు ధనుర్వేదాన్ని ఆపోశన పట్టి దినకరుణ్ణే దివినుంచి భువికి కూలుస్తానని బెదిరించిన జగజెట్టి. ఇటు తపశ్శక్తితో కామధేనువును సృష్టించి సర్వార్థాలను సంపాదించగల్గినమేటి తపస్వి. ఆయన శౌర్యానికి, ధైర్యానికి, శాంతానికి, సహనానికి పెట్టింది పేరు. ఆయన పేరు జమదగ్ని. రేణుక ఆయన అర్ధాంగి.

ఆయనలోని సహనం, క్రియాశీలం, పవిత్రత ప్రపత్తి మనకీనాడు కావాలి ఆదర్శం. అప్పుడే అవతారపురుషుణ్ణి ఈ లోకానికి అందించగల యోగ్యత, అవకాశం మనకు తప్పక కలుగుతాయి.

—ప్రధానసంపాదకుడు.

# జమదగ్ని

మన వారసత్వం:

మనమహర్షులు మనకు త్రికాలాలలోనూ ఆరాధింపదగ్గ మహనీయులు. వారు మనలో ఆధ్యాత్మిక విలువలు కలిగించారు. ధర్మం బోధించారు. మోక్షమార్గం చూపించారు. ఈ విషయంలో సర్వమానవప్రపంచానికి భిక్ష పెట్టారు. అహింసాప్రవృత్తితో, సత్యం ఆధారంగా తాము ధర్మమార్గంలో పయనించి మనకు మంచి మార్గం చూపారు. అరణ్యాలలో కందమూలాలతో కాలంగడిపారు. తపస్సుచేసి సంపాదించుకొన్న పుణ్యఫలంలోకూడా మనకోసం ఆరవ భాగం ధారపోశారు. ప్రజాసంక్షేమం కోసం రాజులకు తమశక్తియుక్తులు సమర్పించారు. లోకకల్యాణంకోసం వాళ్ళచేత యజ్ఞయాగాదులు చేయించారు. స్వయంగా వాళ్ళు కూడా చేశారు. ఉపనిషత్తులూ భాష్యాలూ ధర్మశాస్త్రాలూ ఇతిహాసాలూ పురాణాలూ వ్రాసి భావితరాల వారికోసం భద్రపరిచారు. వాటిద్వారా మన నైతిక గుణగణాలకూ ధార్మికచింతనకూ సత్ప

వర్తనకూ పునాదులువేశారు. వేదకాలంనుంచి వస్తున్న అలాంటి ధర్మ మూర్తులకు మనం వారసులం. అంచేతనే ఈ నాటికికూడా కాశ్యపసగోత్రం - భారద్వాజసగోత్రం - ఆత్రేయసగోత్రం - కౌండిన్యసగోత్రం - అని యిలా వారి నామధేయాలతో మన గోత్రనామాలు ముడిబడి ఉన్నాయి.

ధర్మసంస్థాపనంలో దైవధిక్కారం:

ముఖ్యంగా అధర్మానికి చోటివ్వక ఇకముందు ఏనాడూ ఎవడూ మార్చడానికి వీలుగాని విధంగా ధర్మాన్ని సుస్థిరంచేసి పరిరక్షించారు. ఈ కృషిలో అవసరం ఏర్పడ్డప్పుడు దైవాన్ని సైతం ధిక్కరించగలవాళ్ళూ ధిక్కరించినవాళ్ళూ శపించగలవాళ్ళూ శపించినవాళ్ళూ కూడా ఈ మహర్షులే. అలాంటి మహోన్నతమైన స్థాయి వాళ్ళలో ఉండడం వల్లనే విష్ణుమూర్తి అంతటివాడు వామనుడుగా పరశురాముడుగా రెండుపర్యాయాలు ఈ ఋషి కులంలో పుట్టాడు. అలాంటి మహర్షులు పోయినా వారికీర్తి మాత్రం అజరామరం. ఆకాశతలంలో "సప్తర్షి మండల" రూపంతో ఈ నాటికీ ప్రకాశిస్తున్న నక్షత్రాలే మన మహర్షుల ఔన్నత్యానికి ప్రతీకలు.

## సప్తర్షులంటే ఎవరు?

అలాంటి మహర్షులలో వసిష్ఠుడు-అత్రి-గౌతముడు-కశ్యపుడు-భరద్వాజుడు-జమదగ్ని-విశ్వామిత్రుడు సుప్రసిద్ధులు. చిత్రవిచిత్రమైన చరిత్రలుగలవాళ్ళు. వీళ్ళందరూ వైవస్వతమనువు కాలంవాళ్ళు. ఒక్కొక్క మనువు కాలంలో పదేసిమంది మహర్షులు ధర్మాధర్మ విచారణాధికారులుగా ఉంటారు. వీళ్ళనే సప్తర్షులు అంటారు.

## భృగువంశపరంపర:

అలాంటి మహర్షిలోకంలో భృగువంశం చాలా గొప్పది. పేరుపడ్డది కూడా. భృగుమహర్షి ఈ వంశానికి మూలపురుషుడు. బ్రహ్మదేవుని హృదయంనుంచి పుట్టిన మహానుభావుడు. ఈ వంశంలో పుట్టినవాళ్ళనందరినీ భార్గవులంటారు. ఈ భృగుమహర్షి కుమారుడు చ్యవనుడు. చ్యవనుని కుమారుడు ఔర్వుడు. ఔర్వుని కుమారుడు ఋచీకుడు. ఇతణ్ణి రుచికుడు అనికూడా అంటారు. ఈ ఋచీకమహర్షి అద్భుతమైన తపోబలసంపన్నుడు. సత్యసంధుడు. ధనుర్వేదం సొంతంగా తెలిసినవాడు. ఇతనికి నాలుగు వేదాలూ కరతలామలకం.

మీ అమ్మాయినిచ్చి పెళ్లి చెయ్యి!

అప్పట్లో గాధి అనే రాజు రాజ్యపాలన చేస్తుండేవాడు. అతనిది జహ్నువంశం (అదే కుశికవంశం కూడా). ఓ రోజు గాధి రాజు దగ్గరికి వెళ్లాడు ఋచీకమహర్షి. రాజకుమార్తె సత్యవతి అందాలరాశి. ఆ అందంచూసి పరవశించిపోయాడు మహర్షి. ఆమెను పెళ్లాడాలనుకొన్నాడు. వెంటనే రాజుగారితో ఇలా అన్నాడు.

"మహారాజా! మీ అమ్మాయి సత్యవతి సౌందర్యం చూసి ముగ్ధుణ్ణయ్యాను. బ్రహ్మచర్యం పాటిస్తూ తపోవృత్తిలో ఉన్న నాకు ఆమె మీద మనసు లగ్నమైంది. ఆమెను పెళ్లాడదలచు కొన్నాను. కనక అంగీకరించి నాకు మీ అమ్మాయినిచ్చి వివాహం జరిపించు".

ఈ మాటలు మహారాజుకు ఆగ్రహమూ-ఆశ్చర్యమూ-భయమూ-కలిగించాయి. ఒక పేదబ్రాహ్మణుడు మహారాజ కుమార్తెను కోరడమా! అని ఆగ్రహం. తపోవృత్తిలో ఉండే మహర్షి కోరదగిన కోర్కెనా-అని ఆశ్చర్యం! అంగీకరింపకుంటే-శపిస్తాడేమో-అని భయం. అంచేత రాజుకు మనోవైకల్యం కలిగింది. బాగా ఆలోచించాడు. ఉపాయంతో ఇలా అన్నాడు.

ఎప్పుడు తలుచుకుంటే అప్పుడే!

"మహర్షీ! మీ కోరిక అంగీకరించాను. మా అమ్మాయినిచ్చి మీకు వివాహం జరిపిస్తాను. కానీ అందుకు తగిన ఉంకువ (ఓలి) ఇవ్వాలి.

"అలాగే మీరు ఏంకోరినా ఇస్తాను" అన్నాడు మహర్షి. ఐతే వినండి. అంటూ ఇలా చెప్పాడు మహారాజు.

"నల్లటి చెవులతో వుండే తెల్లటి గుఱ్ఱాలు వెయ్యి తీసుకురావాలి. అలా యిస్తే మా అమ్మాయితో మీకు వివాహం జరిపిస్తాను".

అందుకు అంగీకరించి వెళ్ళిపోయాడు మహర్షి. అలా వెళ్లి గంగానదికి ఉత్తరతీరం చేరాడు ఋచీకమహర్షి. గంగలో స్నానంచేసి భక్తి పూర్వకంగా వరుణుణ్ణి ఉపాసించాడు. వరుణుడు ప్రత్యక్షమయ్యాడు. మహర్షి కోరిన కోరికను ప్రసాదిస్తూ ఇలా అన్నాడు.

"నీవు ఎప్పుడు తలచుకొంటే అప్పుడే అక్కడే అలాంటి గుఱ్ఱాలు ఉద్భవిస్తాయి" అంటూ వెళ్లిపోయాడు. ఋచీకుడు కాన్య

కుబ్జం చేరువలో వరుణోపాసన చేసి అలాంటి గుఱ్ఱాలను వెయ్యిం టిని సృష్టించాడు. అలా సృష్టించిన వెయ్యిగుఱ్ఱాలతో మహారాజు దగ్గఱికి వచ్చి ఓలిగా సమర్పించాడు. మహర్షి యొక్క ప్రభావం చూసి ఆశ్చర్యపడ్డాడు మహారాజు. అంతటివాడు తనకు అల్లుడు గావడం మంచిది అనుకొన్నాడు. మాటతప్పక కుమార్తె నిచ్చి వివాహం చేశాడు.

మా తల్లికికూడా పుత్రసంతానం అనుగ్రహించండి!

వివాహమైన తరువాత భార్యతోపాటు తన ఆశ్రమానికి వచ్చి గృహస్థాశ్రమంలో ప్రవేశించాడు ఋచీకుడు. సత్యవతి కూడా నిత్యసంతోషంతో పతిఅనుగ్రహంకోసం సకలసపర్యలూ చేస్తుంటుంది. ఇలా కొంతకాలం గడిచింది. సంతానవంతుడు కావాలి అన్న కాంక్ష కలిగింది మహర్షికి. ఓనాడు భార్యను సమీ పించి ఇలా అన్నాడు మహర్షి.

"కాలం కలిసి రాబోతూంది. సంతానవతి కాబోతున్నావు నువ్వు".

ఆ మాటతో పరవశం చెంది భర్తతో ఇలా అన్నది ఆమె.

"స్వామీ! మీరు తపోబలసంపన్నులు. ఏ కార్యమైనా చేయశక్తిగల మహానుభావులు. నన్నుఅనుగ్రహించినట్లే మాతల్లినికూడా అనుగ్రహించండి. ఆమెకు మగసంతానం లేదు కనుక పుత్రసంతానం ప్రసాదించండి"అంటూ ఇంకా యిలా అన్నది.

"పుణ్యమూర్తి ఐన నీ భర్తయొక్క తపోమహిమతో నాకు పుత్రసంతానం కలిగేలా సాయపడు" అని లోగడ మాతల్లి నన్ను అర్థించింది. అంచేత ఆమెను అనుగ్రహించండి.

అర్ధాంగిమాటలు ఆలకించాడు మహర్షి. అపూర్వమైన తన తపోబలంతో రెండుచరువులు-ద్రవరూపమైన హవిస్సులు సృష్టించాడు. ఒకటి పరిపూర్ణమైన బ్రాహ్మణత్వంతో ప్రకాశిస్తూంది. మరొకటి అజేయమైన క్షత్రియతేజస్సుతో ప్రకాశిస్తూంది. ఆ రెండు చరువులూ భార్యకు చూపి ఇలా చెప్పాడు మహర్షి.

"ఋతుకాలంలో నువ్వు మేడి (అత్తి) చెట్టునూ మీతల్లి రావి చెట్టునూ ఆలింగనం చేసుకొండి. ఆ తరువాత బ్రాహ్మణత్వంతో ప్రకాశిస్తున్న చరువును నువ్వూ, క్షత్రియ తేజస్సుతో ప్రకాశిస్తున్న చరువును మీతల్లి స్వీకరించండి. అలా చేశారంటే శమమూ దమమూ మొదలైన గుణాలుగల బ్రాహ్మణుడు నీకు

పుడతాడు. క్షత్రియులకు అజేయుడైన క్షత్రియుడు మీ తల్లికి పుడతాడు".

అలా చెప్పి స్నానం చేయడం కోసం నదికి వెళ్ళాడు మహర్షి.

చరువులు తరువులు తారుమారైనాయి!

ఇంతలో కూతురినీ అల్లుణ్ణీ చూడాలన్న ఉద్దేశ్యంతో గాధి రాజు అతనిభార్య ఋచీకమహర్షి ఆశ్రమానికి వచ్చారు. అలా వచ్చిన తలిదండ్రులను గౌరవించింది సత్యవతి. ఆనందంతో వాళ్ళకు తన భర్త సృష్టించిన చరువులు చూపింది. విషయం సంపూర్ణంగా తెలిపింది. చాలా సంతోషించారు తలిదండ్రులు. కాలం కలిసి రావడంవల్ల అప్పట్లో ఆ ఇద్దరూ ఋతుకాలంలోనే ఉన్నారు. అంచేత చెట్లను కౌగిలించుకొనడం కోసం ఇద్దరూ వెళ్ళారు. దైవవశం వల్ల కూతురు ఆలింగనం చేసుకోవలసిన మేడిచెట్టును తల్లి ఆలింగనం చేసుకొంది. తల్లి ఆలింగనం చేసుకోవలసిన రావిచెట్టును కూతురు ఆలింగనం చేసుకొంది. అలాగే చరువులు కూడా తారుమారుగా స్వీకరించారు.

తానొకటి తలిస్తే!

ఇంతలో ఋచీకమహర్షి ఆశ్రమానికివచ్చి అత్తమామలను చూసి ఆనందించాడు. పరస్పరం కుశలప్రశ్నలు వేసుకొన్నారు. మాటల సందర్భంలో తల్లీకూతుళ్ళు చేసిన పొరపాటును దివ్య జ్ఞానంతో గ్రహించాడు మహర్షి. భార్యను పిలిచి—

"తానొకటి తలిస్తే దైవం మరొకటి తలస్తుంది" అన్న పెద్దల వాక్యం యథార్థం.

"తరువులనూ చరువులనూ ఉపయోగించుకొనడంలో నువ్వూ మీతల్లి పొరపాటుబడ్డారు. ఒకరు ఉపయోగించవలసిన వాటివి మరొకరు ఉపయోగించారు. అంచేత మీకు పుట్టబోయే సంతానంలో కూడా మార్పుఉంటుంది. క్షత్రియాంతకుడూ క్రూరుడూ ఐన పిల్లవాడు నీకూ, బ్రహ్మభూతుడూ తపోధనుడూ ఐన పిల్లవాడు మీ తల్లికి పుడతారు" అన్నాడు. ఆ మాటలు వింటూనే గజ గజ లాడింది సత్యవతి. "స్వామీ! స్వామీ! అనుగ్రహించండి" అంటూ భర్త పాదాలమీద పడింది. వలవలమని ఏడ్చింది. క్రూరుడైన కుమారుణ్ణి ప్రసాదించకండి అని బావురుమంది.

మనుమడు అలా అయేట్లు చేస్తాను!

కరుణామయుడు మహర్షి కనికరించాడు భార్యను. తన తపోబలంతో సృష్టించబడ్డ చరువులవల్ల రావలసిన ఫలితం వస్తుంది. కానీ తల్లికి రావలసిన ఫలం కూతురికీ కూతురికి రావలసిన ఫలం తల్లికీ రాబోతూంది. ఇలా వ్యత్యస్తం కావడానికి ప్రబలమైన కారణం ఉండాలి. కారణం లేందే కార్యం జరుగదుగా! దైవప్రేరణ ఇలా ఉంది కాబోలు-అనుకొన్నాడు తనలో. భార్యతో "ఈ విశేషం నీ కుమారునిలో కాక అతనికి పుట్టబోయే కుమారునిలో ఉండేలాగ అనుగ్రహిస్తున్నాను" అన్నాడు.

అనుగ్రహ పూర్వకమైన ఆ మాటలకు కొంత ఉపశమించింది సత్యవతి.

జమదగ్ని జననం:

కాలక్రమంలో సత్యవతీ ఆమె తల్లీ గర్భవతులయ్యారు. నవమాసాలు నిండాయి. ఒక శుభముహూర్తంలో సత్యవతికి ఒక పిల్లవాడు పుట్టాడు. ఆమె తల్లికి మరో పిల్లవాడు పుట్టాడు. అతడే విశ్వామిత్రుడు. అలా పుట్టిన పిల్లవానికి జాతకర్మచేసి "జమదగ్ని" అని నామకరణం చేశాడు ఋచీకమహర్షి. క్రమంగా

పెరుగుతున్నాడు జమదగ్ని. పరమశాంతుడు. ఎప్పుడూ తపస్సు మీదనే ఆసక్తి ఆపిల్లవానికి. క్రమంగా ఇంద్రియాలను నిగ్రహించాడు. నాలుగు వేదాలూ పరిపూర్ణంగా అభ్యసించాడు. తపోవనాలలో వుండే మహర్షులందరూ ఈ బాలుణ్ణిచూసి సంతోషిస్తుంటారు. బ్రహ్మవర్చస్సు అతని ముఖంమీద నిరంతరం తాండవమాడుతుంటుంది. దానికితోడు ధనుర్వేదం సొంతంగా అతనిలో అవహింప చేశాడు తండ్రి. అంచేత విలువిద్యలో అతణ్ణిమించినవాడు ఋషిమండలంలోనే కాదుగదా సమస్త రాజమండలంలోనూ ఎవడూ లేకపోయాడు. శరసంధానంలోనూ లక్ష్యశుద్ధిలోనూ అతనికి అతడేసాటి. బాల్యం కౌమారం గడిచిపోయింది. అతనిలో యౌవనం ప్రాదుర్భవించింది.

**కారణంలేకుండా కార్యంలేదు:**

సత్యవతి-ఆమెతల్లి-తరువులూ చరువులూ ఉపయోగించుకొనడంలో పొరపాటు ఎలా కలిగింది? ఎందుకు అలా జరిగింది? అంటే ఏదో కారణం ఉండాలి. కారణం లేందే కార్యం జరగదు.

ఓనాడు బ్రహ్మలోకంలో దేవతలందరూ సభజేరి వర్ణసంకరం మీద చర్చిస్తున్నాయి. ఆ మాటలసందర్భంలో "భృగు-కుశిక

వంశాలు సంకరం కాబోతున్నాయి'' అన్నాడు బ్రహ్మదేవుడు. ఆ సభలోనే వున్న భృగుకుమారుడు చ్యవనుడు విన్నాడు. పరమ పవిత్రమైన తన బ్రాహ్మణ వంశం క్షత్రియవంశంతో సంకరం కాబోతుంది. దానిని నివారించి వంశప్రతిష్ఠనూ బ్రాహ్మణత్వమునూ నిలపాలి అనుకొన్నాడు. సాహసమైన కార్యం అది. దైవనిర్ణ యాన్ని ధిక్కరించడం అంత తేలికకాదుగా! శపించి కుశికవంశాన్ని నాశనం చేయాలి అనుకొన్నాడు చ్యవనమహర్షి. కుశికరాజు చెంత కొచ్చాడు. రాజదంపతులిద్దరూ భక్తిపూర్వకంగా సేవించారు మహర్షిని. అనేక విధాలుగా పరీక్షించాడు రాజదంపతుల్ని చ్యవ నుడు. విసుగూ విరామం లేకుండా సేవజేశారు రాజదంపతులు. మహర్షిని రథంమీద ఉంచి గుర్రాలకు మారుగా వాళ్ళే లాగారు. జాటీ దెబ్బలూ కొరడాదెబ్బలూ తిన్నారు. రక్తమయమైనాయి వాళ్ళ శరీరాలు. ఐనా మహర్షిమీద భక్తి ఏమాత్రం తగ్గలేదు వాళ్ళకు. ఇరవైఒక్కరోజులు నిద్రాహారాలు మాని మహర్షి సేవ చేశారు వాళ్ళు. శపించడానికి అవకాశమే రాలేదు మహర్షికి. శపించడం సాధ్యం కాదనుకొన్నాడు. సంతోషంతో రాజదంపతు లకు తనరాకలోని రహస్యం చెప్పాడు. "కుమారుడు గాధి రాజుకు పుట్టబోయే కుమార్తెను (సత్యవతి) నా మనుమడు ఋచీ కుడు వివాహం చేసుకొంటాడు. వాళ్ళకు జమదగ్ని [illegible]



రుడు పుడుతాడు. అతడు ధనుర్వేదం సొంతంగా తన తండ్రిద్వారా తనలో ఆవహింప చేసుకొంటాడు. ఆ విశేషం అతనికుమారుడు పరశురామునిలో శోభిస్తుంది. ఆ ధనుర్విద్యాపాటవంతో సమస్త క్షత్రియకుల నిర్మూలనం చేస్తాడు పరశురాముడు. అదే మహా విష్ణువు యొక్క ఆరవ అవతారం. పరశురామావతారం. ఇది దైవనిర్ణయం".

చూశారా! కారణం ఇలా ఉన్నందువల్ల కార్యం అలా జరిగింది. అలా కానిపక్షంలో ఋచీకమహర్షి అంతటివాడు చెప్పిన నియమంలో మార్పు జరుగుతుందా? విష్ణుమూర్తి యొక్క దశావతారాలలో ఒక అవతారం ముడిబడివుంది యిందులో. దానికి అనుబంధంగా రామావతారం చోటుచేసుకొనివుంది. అంచేతనే అలా జరిగింది.

## అన్నింటినీ ఇవ్వగల ధేనువు:

ప్రసేనజిత్తు అనే ఇక్ష్వాకువంశపు రాజుకూతురు రేణుకాదేవితో జమదగ్నికి వివాహం జరిగింది. కుమారుని వివాహానంతరం జమదగ్నితండ్రి తపోవనాలకు (గృహస్థాశ్రమం విడిచి) వెళ్ళిపోయాడు. తల్లి సత్యవతి కౌశికీనదిగా మారి ప్రవహించింది.

గృహస్థాశ్రమంలో ఉంటున్నాడు జమదగ్ని. శమదమాది ఉత్తమ గుణాలతో శోభిస్తున్నాడు. మహా తపస్సంపన్నుడైన జమదగ్ని తన తపోమహిమతో ఒక హోమధేనువును సంపాదించాడు. అవసరం ఏర్పడ్డప్పుడు ఎందరికైనా దేనినైనా సమకూర్చగల సామర్థ్యంగల గోవు అది. ఆ కామధేనువు కారణంగా ఏలాటి కొరత లేక రేణుకాజమదగ్నులు తమ నిత్యజీవితంలో ఆనందం అనుభవిస్తున్నారు.

ఆకాశంనుంచి నేలకూలుస్తాను!

జమదగ్నికి తన ధనుర్విద్యా నైపుణ్యం!

కొనడం అలవాటు. అందుకు అతని భార్య రేణుక తోడ్పడుతూం టుంది. అమ్ములు కట్టకట్టుక పోయి బయలుప్రదేశంలో ఉంచి ఒక్కొక్కటిగా ప్రయోగించేవాడు. అవి చాలాదూరంలో పడుతూ ఉంటాయి. అలా పడ్డ అమ్ములు రేణుకాదేవి ఏరి భర్తకు తెచ్చి యివ్వడం అలవాటు. ఒకరోజు మట్టమధ్యాహ్నవేళ. సూర్య కిరణాలు తీక్షంగా వున్నాయి. భర్త ప్రయోగించిన అమ్ములు ఏరి తీసుకరావడంలో రేణుకకు కొంత ఆలస్యమైంది ఆరోజు. భార్య మీద కోపపడ్డాడు. ఎందుకింత ఆలస్యంగా వచ్చావు అని ప్రశ్నిం చాడు భార్యను. కుసుమకోమలి ఆవిడ. చాలా అలసిపోయివుంది.

"సూర్యుని ఎండవేడిమి చాలా దుస్సహంగా ఉండడంవల్ల చెట్ల నీడల్లో ఆగుతూ వచ్చాను. అంచేత ఆలస్యమైంది. క్షమించండి" అన్నది-ఆవిడ. ఆ మాటతో మహర్షికి సూర్యునిమీద ఆగ్రహం కలిగింది. "నాభార్యను ఎండవేడిమితో సూర్యుడు బాధించడమా! వాణ్ణి ఆకాశంనుంచి నేలకూలుస్తాను" అంటూ బాణం సంధించాడు.

ఇదే మొదటిసృష్టి:

సూర్యుడు భయపడ్డాడు. ముసలి బ్రాహ్మణుడయ్యాడు. జమదగ్ని దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు. "మహర్షీ! సూర్యునివల్ల కదా మేఘాలు ఏర్పడి వర్షం కురుస్తున్నది? ఆ వర్షజలంవల్లనే కదా ఓషధులు పెరుగుతున్నాయి? అంచేతనే దేవతలకు హవ్యాలు ఏర్పడుతున్నాయి. కనక అలాంటి లోకబాంధవుణ్ణి శిక్షించడం సమంజసమేనా? ఇలాంటి క్రూరకార్యం తాపసికి-నీకు తగిందేనా"

సూర్యునిమాటలకు శాంతించాడు జమదగ్ని. తనకు శాంతం లేకపోవడం పొరపాటు అని గ్రహించాడు. బాధపడ్డాడు కూడా. ఇంతలో సూర్యుడు నిజరూపం ధరించాడు. సూర్యభగవానునికి నమస్కరించి క్షమాపణ చెప్పుకొన్నాడు జమదగ్ని. జమదగ్ని శాంతస్వభావానికి సంతోషించాడు సూర్యుడు.

మానసికంగా గొడుగూ పాదరక్షలూ సృష్టించాడు సూర్యుడు. జమదగ్నికి బహూకరించాడు. నా కిరణాలవల్ల కలిగే వేడికి యివి ఉపశమనంగా ఉంటాయి. కనక వీటిని ఉపయోగించుకో అన్నాడు సూర్యుడు. వాటిని చూచి ఆశ్చర్యపడ్డాడు జమదగ్ని. ఇంతకుపూర్వం సృష్టిలోనే లేవు అవి. "కొత్తగా వీటిని ఎందుకు ఇలా సృష్టించావు" అని సూర్యుణ్ణి ప్రశ్నించాడు జమదగ్ని.

"ఔను నిజమే. ఇంతకు పూర్వం సృష్టిలోనే లేవివి. నీ కోసమే సృష్టించాను. వీటిని ధరించడంవల్ల పాదాలకూ శిరస్సుకూ వేడి తగలదు" అంటూ, "శాంతస్వభావులైన మీలాంటి వాళ్ళకు దానమిస్తే ఇహపరసుఖాలు రెండూ కలుగుతాయి దాతకు. సంతృప్తి కూడా కలుగుతుంది" అన్నాడు.

జమదగ్ని వాటిని స్వీకరించి భార్యాసమేతంగా కృతజ్ఞతతో సూర్యుణ్ణి పూజించాడు. సూర్యసృష్టివల్ల ఏర్పడ్డ పాదరక్షలూ గొడుగూ వృద్ధులకూ సాధులకూ ఇవ్వడం మంచిది. అంచేతనే ఈనాటికీ పితృకార్యాలలో ఉపానత్తులూ (పాదరక్షలు) గొడుగు ఇస్తుంటారు. ఈ ఆచారం జమదగ్ని నుంచి మనకు వచ్చింది.

ప్రాచీనకాలంలో ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ ఉండిన మానవుడు ఎండతీవ్రతకు చెట్టుకిందికి పోవడం వర్షం కురిసి నపుడు చెట్టును ఆశ్రయించడం పరిపాటి. జమదగ్నివల్ల అది మారింది. నీడకోసం చెట్టు చెంతకు పోకనే నీడను ఎలా తెచ్చు కోవడం? అన్నదే విజ్ఞానం.

కంచే చేనుమేస్తే!

యౌవనంలో ఉన్న రేణుకాజమదగ్నులు ఓరోజు నర్మదా నదీతీరం వెళ్ళారు. సుందరమైన ఉపవనం ఒకటి చూశారు వాళ్ళు. జనసంచారం ఏమాత్రం లేదక్కడ. నానారకాలైన వృక్షాలతో ఫలాలతో పుష్పాలతో పరిశోభిస్తూవుంది ఆ ఉపవనం. సుగంధంతో కూడిన చల్లగాలి వీస్తూంది. చిలుకలూ గోరువంకలూ నెమళ్ళూ నానావిధాలుగా రొదచేస్తున్నాయి ఆ దృశ్యం చూడగానే శృంగార భావం కలిగింది వాళ్ళకు. అంచేత అప్పుడే వికసించిన పుష్పాలతో పాన్పు ఏర్పాటు చేశారు. సరసాలాడుకొంటున్నారాదంపతులు. క్రమంగా భావోద్రేకం ఏర్పడుతూఉంది వాళ్ళలో ఇద్దఱు పరవ శించి పోతున్నారు. అందులోనూ పట్టపగలు. కర్మసాక్షి (సూర్యుడు) చూస్తున్నాడు. ధర్మభంగం కలగబోతూంది ఈ ఋషి దంపతులవల్ల అని అనుకున్నాడు. వృద్ధబ్రాహ్మణరూపం ధరించి వాళ్ళచెంతకువచ్చి ఇలా అన్నాడు.

"అయ్యా! జమదగ్నిమహర్షీ! నీవు సామాన్యమైన మనిషివి కావు. సాక్షాత్తు బ్రహ్మదేవుని మనుమడివి. వేదకర్తవు పైగా తపశ్శాలివి. ఇలాంటి నీవు ధర్మం ఉల్లంఘించి పట్టపగలు సురతక్రీడకు ఉపక్రమించడం భావ్యంకాదు. "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః" అన్నట్లు గొప్పవాళ్ళు ఏదిచేసినా సామాన్యులు దానిని అనుసరిస్తారు. అంచేత ధర్మభంగం కావడం తథ్యం. తపోధనుల్లో అగ్రగణ్యుడివి నువ్వు. నువ్వే యిలా ధర్మాన్ని నిరాకరిస్తే వేదధర్మాలకు విలువ అంటూ ఉండదు. నేను కర్మసాక్షిని కావడంవల్ల నీకు చెప్పడం ధర్మం గనక ఇలా వచ్చి చెబుతున్నాను".

నన్నే ఆక్షేపిస్తావా?

ఆ మాటలతో జమదగ్ని మండిపడ్డాడు. భార్యాభర్తలు పూలపాన్పునుండి లేచారు. నగ్నంగా ఉండడంవల్ల చీరధరించి రేణుక సిగ్గుపడి వెళ్లింది. అలా భార్య వెళ్ళడంతో మరీ మతి చలించింది మహర్షికి. మితిమీరిన కోపంతో ఇలాఅన్నాడు మహర్షి.

"దినకరా! పండితుణ్ణి అన్న దురహంకారంతో నాకు బుద్ధి చెప్ప వచ్చావు నువ్వు. నేనెవరో ఎరగవా? భృగువంశంలో పుట్టిన

వాణ్ణి. నాలుగు వేదాల ధర్మాధర్మాలు క్షుణ్ణంగా ఎరిగినవాణ్ణి. చెబుతాను విను. అజ్ఞాని అయినవాడు తాను చేసిన చెడుకార్యాలవల్ల ఫలం అనుభవిస్తూ జడీభూతుడుగా ఉంటాడు. విజ్ఞాని తాను చేసిన చెడుకార్యాలవల్ల కలిగేదోషాలు పొందకుండా సర్వభక్షకుడైన అగ్ని లాగ మహాతేజస్సుతో ఉంటాడు. ఫలప్రదాతననీ కర్మసాక్షిననీ శాస్త ననీ గర్వంతో ఉంటున్నావు. నన్నే ఆక్షేపిస్తున్నావు. నీ చేత రక్షింప బడవలసిన కర్మ నాకు లేదు. తపస్సంపన్నులమూ జ్ఞానమూర్తు లమూ ఐన మాకు శ్రీమన్నారాయణుడే సర్వరక్షకుడు. నీలాంటివాడు మాత్రం కాడు. మా మనోభావాలు అతనికి తెలుసు. అతనినిగూర్చి మాకు తెలుసు. మాకు ఇతరులు బోధింపవలసిన అవసరంలేదు. శిక్షింపవలసిన పనీ లేదు. అంతటి అర్హతకూడా లేదు మీకు. బ్రహ్మదేవుడుగానీ మహేశ్వరుడుగానీ చివరకు యముడుగానీ మమ్ము శిక్షించలేడు. అలాంటి ఉన్నతులమైన మాకు రతిభంగం చేశావు కనక రాహుగ్రస్తుడవై మహాపాపిగా తేజోహీనుడవై పోదువుగాక! అని శపించాడు.

ప్రతిశాపం:

జమదగ్నిశాపం విన్నాడు సూర్యుడు. ప్రతిశాపం పెట్టాడు. "అకారణంగా నన్ను శపించావు కనక ఒకానొక క్షత్రియునిచేత అవమానం పొంది వాని ఆయుధంతో మరణిస్తావు".

**ఈశ్వరునిచేతిలో కూలిపోతావు :**

సూర్యుడు తన్ను శపించాడన్న కోపంతో "నీవు రణ రంగంలో ఈశ్వరునిచేత కూలిపోదువుగాక"అని తిరిగి శపించాడు జమదగ్ని సూర్యుణ్ణి.

ఈ విషయం కశ్యపమహర్షి వల్ల తెలిసింది బ్రహ్మదేవునికి. జమదగ్నిసూర్యుల మధ్య ప్రత్యక్షమయ్యారు వాళ్ళు. బ్రహ్మ దేవుడు ఇద్దఱినీ శాంతపరుస్తూ సూర్యునితో ఇలా అన్నాడు—

**బ్రహ్మదేవుని సర్దుబాటు :**

"భాస్కరా! ఒకానొకదినం ఆకాశంలో మేఘాలచేత కప్ప బడతావు. ఐనా వెంటనే ప్రకాశిస్తావు. మేఘాలు అధికంగా ఉన్నప్పుడు గానీ వర్షం కురుస్తున్నప్పుడుగానీ నువ్వు రాహువు చేత కబళింపబడుతావు. ఐనా కొందరికి కనబడుతూ మరికొందరికి కానరాకుంటావు. నిన్ను చూసి నమస్కరించినవాళ్ళు పాపరహితులు ఔతారు. జన్మ సప్త అష్టమ చతుర్థ దశమ స్థానాలలోనూ జన్మ ఋష నిధనాలలోనూ నీవూ చంద్రుడూ కంటికి కానరాకుంటారు. అర్థం-ఉదయిస్తున్న వేళలోనూ మట్టమధ్యాహ్న వేళలోనూ అస్త మిస్తున్న వేళలోనూ నీటిలోనూ నీ రూపం చూసిన పాపం వంశ్ర

మిస్తుంది. నీ భార్య ఎడబాటుకు కారణమైన నీ మరో భార్యవల్లా నీ మామగారివల్లా నీ బావమరదివల్లా నువ్వు నీ తేజం పోగొట్టు కొంటావు. మాలి-సుమాలి అనే వాళ్ళతో జరుగబోయే యుద్ధంలో ఈశ్వరుడు నిన్ను ఓడిస్తాడు" అని కొంతవరకు శాపం తిప్పాడు బ్రహ్మదేవుడు.

నీ మరణం లోకకల్యాణానికి బీజం:

జమదగ్ని మహర్షిని చూసి ఇలా అన్నాడు బ్రహ్మదేవుడు:

మహర్షీ! అవమానంతో బాధపడుతున్న సూర్యుణ్ణి ఇంత టితో విడిచిపెట్టు. నీ తేజోబలంవల్ల సమస్త లోకాలూ క్షణ కాలంలో బూడిద ఔతాయి. అంతటి మహత్తరమైన తేజస్సంప న్నుడివి నువ్వు. కోపంతో వృథా చేసుకొంటున్నావు నీ శక్తిని. మీ ఇద్దరూ గొప్పవాళ్ళే. పూజింపతగినవాళ్ళే. మున్ముందు కార్త వీర్యార్జునుడి చేత నీకు అవమానము-ఓటమి-మరణము కలుగు తుంది. ఐనా విష్ణుమూర్తి నీకు కుమారుడుగా పుడతాడు. ఇరవై ఒక్క పర్యాయాలు శోధించి లోకంలో క్షత్రియ నిర్మూలనం చేస్తాడు. నీ మరణం లోకకళ్యాణబీజం ఔతుంది" అంటూ వెళ్ళి పోయాడు. సూర్యుడూ జమదగ్ని పరస్పరం అభినందించుకొని వారి వారి నెలవులకు వెళ్ళిపోయారు.

ఆశ్రమంలో రేణుక భర్తకు భక్తిపూర్వకంగా సేవచేసి అతని అనుగ్రహంతో రుమణ్వంతుడు-సువేషణుడు-వసువు-విశ్వావసువు-పరశురాముడు అనే ఐదుగుర్ని సంతానంగా పొందింది క్రమంగా.

ఇసుకతో కుండ తయారుకాలేదు:

ఓనాడు రేణుకాదేవి నీటికోసం నదికి వెళ్ళింది. చిత్రరథుడు అనే గంధర్వరాజు తనభార్యతో జలక్రీడలో ఉన్నప్పుడు రేణుకాదేవికి విధివశంవల్ల ఆ దృశ్యం చూడాలి అన్న బుద్ధి పుట్టింది. అంచేత వాళ్ళ ఆనందాన్ని చూస్తూ లోలోపల సంతోషించింది. ఆ దృశ్యం చూడడంవల్ల ఉత్తమమైన ఆమె పాతివ్రత్యానికి కొంత దోషం ఏర్పడింది. అంచేత చేతిలో వున్న కడవ క్రిందబడి ముక్కలైంది. ఎప్పుడైనా హఠాత్తుగ క్రిందబడి కడవ ముక్కలైతే తన మహత్త్వంతో ఇసుకతో మరో కుండచేసి నీళ్ళు తీసుకరావడం ఆమెకు అలవాటే. మునుపటిలాగే ఇసుకతో కుండ చేయాలని ప్రయత్నించింది. కానీ ప్రయత్నం వ్యర్థమైంది. మహాయిల్లాలు రేణుకాదేవి. తనతప్పు గ్రహించింది. వెంటనే ఆ నదిలోబడి ఆత్మహత్య చేసుకోవాలని తలంచింది.

ఐనా జరిగిన విషయం భర్తకుచెప్పి అతని అజ్ఞానుసారం ప్రవర్తించడం మంచిదని ఎంచింది. వట్టి చేతులతో ఇంటికి వెళ్ళింది.

## నీ తల్లి తల నరికివెయ్యి!

భార్యచేతిలో కడవ లేకపోవడం చూశాడు జమదగ్ని. జ్ఞానదృష్టితో జరిగిన విషయం తెలుసుకొన్నాడు. పరపురుషుణ్ణి సాపేక్షతో చూచింది ఆవిడ. ఆమెచేసిన దోషానికి అసహ్యపడ్డాడు. మరణదండనమే ఉచితమైన శిక్ష అని భావించాడు. ముందు వెనుకలు ఆలోచించకుండానే పెద్దకుమారుణ్ణి పిలిచాడు. "నీ తల్లి శిరస్సు తెగగొట్టు"అన్నాడు.

చూశారా! జమదగ్ని సౌశీల్యం; ఆదర్శం; పరపురుషుణ్ని ఆశపడి చూసినా అది వ్యభిచారమే అని అతని భావం. ఆమె పరమసాధ్వి అనికూడా అతనికి తెలుసు. ఐనా ఆమె శిరస్సును ఖండించమన్నాడు. ఎందుకు? శీలంలేని జీవితం నిందనీయం. తన అర్ధాంగి అవమానం భరించడంకంటే అంతమొందించడం ఉత్తమం అనుకొన్నాడు. అర్ధాంగిమీద ఎంత గౌరవభావమో మహర్షికి చూడండి!

## మాటవినని కొడుకులు!

పెద్దకుమారుడు రుమణ్వంతుడు. బుద్ధిమంతుడు. వేదం బాగా తెలిసినవాడు. తండ్రి ఆజ్ఞ పాటిస్తే మాతృవధ. "మాతా పూర్వరూపం: పితోత్తరరూపం" అని కదా వేదవచనం అనుకొన్నాడు. తన అసమర్థతను సవినయంగా చెప్పాడు తండ్రికి. చేతులు జోడించి నిలబడ్డాడు తండ్రిపాదాల దగ్గర. రెండవ కుమారుణ్ని పిలిచి తల్లిని చంపమన్నాడు. అతనూ తన అన్నలాగే చేతకాదన్నాడు. అలాగే మూడవవాడూ· నాల్గవవాడూ కూడా చెప్పారు. మాటవినని కుమారులను శపించాడు తండ్రి.

## తల్లితల నరికేశాడు:

చివరి కుమారుడు పరశురాముడు. చాలా చురుకైనవాడు. జరుగుతున్న విషయం గమనించాడు. తనవంతు రాబోతూంది. అప్పుడేం చేయాలి? అని ఆలోచించాడు. నిరాకరిస్తే వాళ్లకు పట్టిన గతే తనకూ పడుతుంది. తరువాత చేయగలిగింది ఏమీలేదు. తండ్రిమాట పాటించడం మంచిది అనుకొన్నాడు. అలాచేస్తే తండ్రిగారి అనుగ్రహం లభిస్తుంది. తండ్రి సంతోషపడి వరప్రదానం చేస్తే తల్లిని బ్రతికించుకోవచ్చు. అన్నలకు శాపవిముక్తి కలిగించవచ్చు. అదీగాక "ఆత్మా వై పుత్రనామాసి" అనే వాక్యానుసారం

తండ్రిఆత్మే కుమారుని రూపంలో ఉంటుంది గనుక ఈ దారుణం తండ్రి చేసినట్లుగనే భావించాడు. అంచేత మాతృ మూర్తివధకే నిర్ణయించుకొన్నాడు. ఇంతలో జమదగ్ని పిలిచి 'నీ తల్లిని వధించు' అన్నాడు. జమదగ్ని నోటిమాట నోటిలోనే ఉంది. రేణుకాదేవిశిరస్సు భర్తపాదాలదగ్గర తెగిపడింది. కర్తవ్యం నిర్వహించాడు కుమారుడు. తండ్రికి సాష్టాంగ నమస్కారంచేసి నిలబడ్డాడు.

నా తల్లి బ్రతకాలి:

పరశురాముని ధైర్యసాహసాలకు సంతోషించాడు జమదగ్ని. మహావీరుని లక్షణాలూ రాజసమూ పోటీపడుతున్నాయి అతనిలో. గతచరిత్ర తెలుసు జమదగ్నికి. ఉత్తరచరిత్రకే యిది నాంది. కుమారుని పితృభక్తికీ మనోనిబ్బరానికీ మెచ్చుకొన్నాడు. వరం ప్రసాదించాడు. "ఏం కావాలో కోరుకో అన్నాడు," మాతృమూర్తి వధకు కానుకగా.

"మరణించిన మాతృదేవత మళ్ళీ బ్రతకాలి. శాపగ్రస్తులైన సోదరులు శాపవిముక్తులు కావాలి. నేను దీర్ఘాయుష్కుడుగానూ అజేయుడుగానూ ఉండాలి" అని వరం కోరుకొన్నాడు పరశు

రాముడు. తథాస్తు అన్నాడు తండ్రి. అలాగే జరిగింది. ఇప్పుడు రేణుకాదేవి చచ్చి బ్రతికింది. అంచేత పాతివ్రత్య దోషకళంకం కూడా తొలిగింది ఆమెకు. తనకుటుంబం బాగుండాలి అని అనుకొంటే ఇదొక్కటే మార్గం. యోచించి చేసిన నిర్ణయం యిది. అంచేతనే ధర్మమూర్తి పరశురాముడు మాతృవధకు పూనుకొన్నాడు.

కన్నుమిన్ను తెలియని కార్తవీర్యార్జునుడు:

కార్తవీర్యార్జునుడు హైహయదేశం రాజు. దత్తాత్రేయ మహర్షికి పరమభక్తుడు. అతనివల్ల అనేక వరాలు పొందాడు. వెయ్యిచేతులు-అణిమాది సిద్ధులు-యశస్సు-బలం-యోగీశ్వరత్వం-పటిష్టమైన ఇంద్రియజ్ఞానం మహారాజుకు అతనివల్ల కలిగాయి. దైవయోగంవల్ల ఓరోజు జమదగ్ని మహర్షి ఆశ్రమం దగ్గరికి సపరివారంగా వచ్చాడు మహారాజు. బాగా అలసిపోయి వున్న మహారాజుకూ అతని పరివారానికీ ఆతిథ్యం ఇవ్వాలనుకొన్నాడు మహర్షి. అంచేత తన దగ్గరనున్న గోవుమహత్వంతో నానారకాల పదార్థాలతో ఆతిథ్యం యిచ్చాడు. అందరూ సంతృప్తి పడ్డారు. దానిమహత్వం చూసి ఆశ్చర్యపడ్డారు. గోవుమీద మనసు పడింది రాజుకు. ఎలాగైనా తనవశం చేసుకోవాలనుకొన్నాడు. తన నగరం చేరుకొన్నాడు. భటులను పంపి ఆశ్రమంలోని

గోవును ఎలాగైనా తీసుకరావలసిందిగా ఆదేశించాడు. భటులువచ్చి మహర్షికి రాజుగారి కోర్కె విన్నవించారు. మహర్షి నిరాకరించాడు. గత్యంతరం లేక భటులు జమదగ్నిమీద యుద్ధానికి సిద్ధపడ్డారు. జమదగ్ని ఈ విషయం ధేనువుకు చెప్పాడు. వెంటనే దాని రోమకూపాల నుంచి వేనకు వేలుగా సైనికులు పుట్టుకొచ్చారు. ఆ సైన్యబలంతో విల్లుబూని తలపడ్డాడు జమదగ్ని. రాజు సైన్యం సర్వనాశనమైంది. ఈ వార్త మహారాజుకు తెలిసింది. సైన్యసమేతంగా వచ్చి జమదగ్నిని ఎదిరించాడు మహారాజు. కానీ ఓడిపోయాడు. తనచేతికి రెండు మూడు పర్యాయాలు దొరికినా ఏదో సదుపదేశం చేసి విడిచి పెట్టాడు మహారాజును.

యుద్ధం చెయ్యొద్దు:

మళ్లీ కొన్నాళ్ళకు మహర్షిని ఎదిరించాడు రాజు. మళ్లీ ఓడిపోయాడు. ఇలా ఇరవై పర్యాయాలు ఓడిపోయాడు కార్తవీర్యార్జునుడు. ఇరవై ఒకటవ పర్యాయం తనసైన్యం యావత్తూ తీసుక వచ్చి మహర్షిని ఎదిరించాడు మహారాజు. విల్లు చేబూని గోవుదగ్గరికి వచ్చాడు మహర్షి. అనుకూలమైన కాలంగాదనీ యుద్ధం చేయవద్దనీ చెప్పింది ధేనువు. ధేనువుమాట నిరాకరించి రాజుతో తలపడ్డాడు మహర్షి. యుద్ధంలో జమదగ్నిని సంహరించాడు కార్తవీర్యార్జు

నుడు. సరాసరి ఆశ్రమంలో ప్రవేశించాడు గోవుకోసం. కానీ గోవులేదు. ఇంద్రలోకం వెళ్ళి అతని రక్షణలో వుందది. వట్టి చేతులతో వెళ్ళిపోయాడు మహారాజు. భర్త శవంమీదపడి విలపిస్తూ ఉంది రేణుకాదేవి. సహగమనం చేయాలని సిద్ధపడింది. ఆకాశవాణి నివారించింది. ఇంతలో భృగుమహర్షి వచ్చి బ్రతికించాడు జమదగ్నిని తన తపోబలంతో.

వెయ్యిచేతులు కూలిపోయాయి :

తన తండ్రికీ కార్తవీర్యార్జునునికీ జరిగిన పోరాటాలలో పరశురాముడు లేడు. తనకు తెలియకుండా జరిగిన పోరాటాలే యివి. జరిగిన విషయం తన తండ్రి మరణం తెలుసుకొన్నాడు పరశురాముడు. ఉగ్రుడయ్యాడు. ముఖంమీద బ్రాహ్మణతేజస్సు మటుమాయమైంది. క్షాత్రం ఉట్టిపడుతూ ఉంది. కండ్లు నిప్పులు గక్కుతున్నాయి. శరీరం అదురుతూ ఉంది. పండ్లు పట పట కొరికాడు. కవచం ధరించాడు. ఒకచేతిలో విల్లు మరోచేతిలో భయంకరమైన గండ్రగొడ్డలి. ముఖంమీద మూడు విభూతి రేఖలు. మధ్య కుంకుమ బొట్టు. ఇది ఆనాటి అతని ఆకారం. మాహిష్మతీనగరం ప్రవేశించాడు. ఈ విషయం ముందుగానే తెలుసుకొన్నాడు కార్తవీర్యార్జునుడు. పదిహేడువేల అక్షౌహిణుల సైన్యంతో పరశురాముణ్ణి

ఎదిరించాడు. కానీ నిష్ప్రయోజనమైంది. పరశురాముడు కార్తవీర్యా ర్జునుణ్ణి వెయ్యిచేతులూ నరికి గండ్రగొడ్డలితో శిరసు ఛేదించాడు.

మనకెంతో ఓర్పు కావాలి!

కార్తవీర్యార్జునుణ్ణి చంపి తండ్రిచెంతకు వచ్చాడు పరశురాముడు. జరిగినవిషయం తండ్రికి చెప్పాడు. ఆ ఉదంతం విని చాలా బాధపడ్డాడు జమదగ్ని. కొడుకుతో ఇలా చెప్పాడు.

"నాయనా! "నావిష్ణుః పృథివీపతిః"అనిగదా! పెద్దలన్నారు. మహారాజు విష్ణువు అంశంగదా! అలాంటి దైవాంశంలో పుట్టిన మహారాజును మన్నించడం మంచిది. గాని వధించడం మనకు తగిన పద్ధతికాదు. మనలాంటి తాపసులకు ఓర్పుముఖ్యం. ఓర్పువల్ల ఐశ్వర్యం; ఐశ్వర్యంవల్ల వివేకం; వివేకంవల్ల మోక్షం సులభంగా లభిస్తుంది. రాజును చంపడంవల్ల వచ్చేపాపం బ్రాహ్మణుణ్ణి చంపిన పాపంకంటే అధికం. అంచేత ఏడాదికాలంపాటు తీర్థ యాత్రలు చేసి పరమేశ్వరుణ్ణి దర్శించి పాపం పోగొట్టుకో".

తండ్రిమాట మన్నించి తీర్థయాత్రకు వెళ్ళాడు పరశురాముడు. చూశారా జమదగ్నిహృదయం. తన్ను చంపినవాని మీదనే ఎంత దయ అతనికి. పశ్చాత్తాపంవల్ల ప్రాయశ్చిత్తంవల్ల పాప పరిహారమౌతుందని అతని నమ్మకం.

ముంగిసై పుట్టు!

ఓనాడు జమదగ్నియింట్లో పితృకార్యం వచ్చింది. అందేత నియమపూర్వకంగా ఉండి పాలుపిదికి ఒకచోట భద్రపరచి స్నానార్థం నదికి వెళ్ళాడు. అతని శాంతస్వభావం పరీక్షించాలను కొన్నాడు క్రోధుడు అనే దైవం. మారువేషంతో వచ్చి పాల పాత్రను దొర్లించాడు. పాలు నేలపాలయ్యాయి. జమదగ్నివచ్చి చూశాడు. వెంతనే మారురూపంలో ఉన్న క్రోధుణ్ణి చూశాడు. ప్రమాదంవల్ల యిలా జరిగిందన్నాడు క్రోధుడు. ఏమాత్రం కోప పడలేదు జమదగ్ని. క్రోధుణ్ణి వెళ్ళమన్నాడు. మానవరూపంలో ఉన్న క్రోధుడు ఆశ్చర్యపడి యిలా అన్నాడు.

"భృగువంశంలోని వాళ్ళందరూ ముక్కోపులని ప్రతీతి. నీవల్ల మాత్రం అది అసత్యం" అంటూ తాను వచ్చినకార్యం యథా ర్థం చెప్పి వెళ్ళిపోయాడు. ఆరాత్రి పితృదేవతలు ప్రత్యక్షమై జమదగ్నితో యిలా అన్నారు. "నీవు మమ్మల్ని పూజించడంకోసం పిదికినపాలు నేలపాలయ్యాయి. అలా కావడానికి కారణభూతుడు క్రోధుడు. వాణ్ణి శపించక శాంతంతో ఉండిపోయావు. నిజంగా అది శాంతమనుకొన్నావా? సమయాసమయాలు గుర్తించి చూపేదే

శాంతంగాని అన్నిటికీ మౌనంగా ఉండడం శాంతంగాదు. అవసర మైనప్పుడు కోపించడంకూడా శాంతంతో సమానమే. కోపించదగ్గ సమయంలో శాంతంతో ఉండడం చాలా దోషం. కనక నీవు చేసిన ఈ దోషానికి ముంగిసగా పుట్టుదువుగాక".

ధర్మాన్ని ఖండించినప్పుడే శాపవిముక్తి :

జమదగ్ని తన పితృదేవతలకు నమస్కారంచేసి ఇలా అన్నాడు. "మహానుభావులారా! తపస్వికి కోపం తగదు గనుక అలా మౌనంగా ఉండిపోయాను. మిమ్మల్ని అవమానించడం నా అభిమతంకాదు. కోపించవలసిన తరుణంలో కోపపడకపోవడం నా దోషమే. నా తప్పు నేను గుర్తించాను. కనుక క్షమించి శాప విమోచనం అనుగ్రహించండి".

పితృదేవతలు అనుగ్రహించి శాపవిమోచనం యిలా చెప్పారు. "ఒక మహాధర్మాన్ని పండితులైన బ్రాహ్మణుల సమూహంలో ఏనాడు నీవు ఖండిస్తావో ఆనాడు నీకు శాపవిముక్తి".

ఆ కారణంగా ముంగిసగా పుట్టాడు జమదగ్ని. ధర్మరాజు అశ్వమేధయాగం చేస్తున్న తరుణంలో యజ్ఞాన్ని ఆక్షేపించాడు. ధర్మరాజు దానం సక్తుప్రస్థుని దానంతో తుల్యం కాదన్నాడు. పశు

వధతో కూడిన యజ్ఞం మంచిది కాదన్నాడు. మానసయజ్ఞం ఉత్తమం అన్నాడు. బ్రాహ్మణుల కోరికమీద సక్తుప్రస్థుని చరిత్ర చెప్పాడు; తక్షణం ముంగిసరూపం పోయి జమదగ్నిగా మారాడు.

నేననుభవిస్తాను :

ఒకప్పుడు సప్తర్షులు ఆకలిబాధ నివారణకోసం కోసి పెట్టిన తామరతూండ్ల కట్ట మాయమైంది. ఒకరిమీద మరొకరు అనుమానపడి అందరూ ప్రమాణాలు చేశారు. ఆ సమయంలో జమదగ్ని యిలా ప్రమాణం చేశాడు.

"ముట్టుదోషంవున్న భార్యతో సంపర్కం చేయడంవల్లా; నీళ్ళలో మలమూత్రాలు వదలడంవల్లా; కుయుక్తితో ఒకాళ్ళ కొకళ్ళకు ద్వేషం కలిగించడంవల్లా; ఇతరులతో కలహించడంవల్లా. ప్రతిఫలం పొందాలన్న ఉద్దేశంతో యితరులను గౌరవించడంవల్లా ఏపాపం కలుగుతుందో ఆ పాప ఫలితం తామరతూండ్లను నేను దొంగిలించి ఉండినపక్షంలో అనుభవిస్తాను". జమదగ్ని ఎలా ప్రతిజ్ఞ చేశాడో చూశారా! వీటిద్వారా జాతికి ఎలాంటి నీతి చెప్పాడో చూడండి.

మంత్రోపాసన :

"ఉపాసన" విషయంలో తనకు కలిగిన సందేహాలు నివృత్తి చేసుకొనడంకోసం నైమిశారణ్యం వెళ్ళాడు జమదగ్ని. లోమశ మహర్షి ద్వారా దేవీమాహాత్మ్యం విన్నాడు. సత్యవ్రతునికథకూడా విన్నాడు. సారస్వత బీజమంత్రరహస్యం తెలుసుకొన్నాడు. అలాగే ఉపాసించాడు. రేణుకాదేవివధవల్ల కలిగిన దోషం పరిహరించు కొన్నాడు.

శూరుని చేతిలో ....

తన తండ్రిమరణానికి జమదగ్ని కారణంగా భావించాడు కార్తవీర్యార్జునుని కొడుకు శూరుడు. పగతీర్చుకోవాలి అనుకొన్నాడు. పరశురాముడు లేని తరుణంలో ఆశ్రమంమీదపడి జమదగ్నిని సంహరించాడు. భర్తమరణంచూచి తల్లడిల్లింది రేణుక. రామా! రామా! అని కుమారుణ్ణి అరిచింది. ఇరవై ఒక్క పర్యాయాలు గుండెలు బాదుకొంది. కొంతసేపటికి పరశురాముడువచ్చి తండ్రిశవం చూశాడు. ఒళ్లు మరచిపోయాడు. మాహిష్మతీనగరం అల్లకల్లోలం చేశాడు. కంటికి కనబడ్డ క్షత్రియుణ్ణి విచక్షణారహితంగా చంపాడు. శూరుణ్ణీ వాని సోదరులనూ అంతమొందించాడు. అడ్డంవచ్చిన రాజులనందరినీ చంపాడు. ఇలా ఇరవై ఒక్క పర్యాయాలు క్షత్రియుల్ని వెదికి, వెదికి చంపాడు. ఆరాజుల రక్తం ఐదు మడుగులు చేశాడు. ఆరక్తంతో పితృతర్పణ చేశాడు (అదే

నేటి శమంతపంచకం). తాను జయించిన భూభాగం సంపూర్ణంగా కశ్యపమహర్షికి దానం చేశాడు. భర్తతో సహగమనం చేసింది రేణుకాదేవి. పరశురాముడు-తపోవనాలకు వెళ్ళిపోయాడు.

సందేశం:

జమదగ్ని జననం చిత్రమైన స్థితి. యౌవనంలో ముక్కోపి. వయసుమళ్ళిం తరువాత శాంత స్వభావం. వార్ధక్యంలో పరమ శాంత స్వరూపం. చంపతగ్గవానిని కూడా క్షమించాలి అన్నాడు. చేసిన దోషాలకు ప్రాయశ్చిత్తం చెప్పాడు. దొంగతనం మహా పాపం అన్నాడు. పురాకృత కర్మఫలం అనుభవించి తీరాల్సిందే అని నిరూపించాడు (ముంగిసగా). తీర్థయాత్రలు మంచివని చూపాడు. చేయకూడని పాపకార్యాలు విదుష్టంగా చూపించాడు. ఆకలి బాధలో ఉండే వ్యక్తి తప్పొప్పులు పరిగణించడు అన్న నగ్న సత్యం అనుభవపూర్వకంగా చెప్పాడు. ఇలా మానవజీవితంలోని యథార్థాలు తన జీవితంలో సమన్వయించేసి చూపించాడు. ఒకానొక ఉన్మాదిచేష్టకు జీవితం బలియిచ్చాడు. నక్షత్రరూపంలో ఆకాశంనుంచి కిందికి చూస్తున్నాడు. ఎందుకూ?

తన నిండుజీవితంలో పండిన అనుభవాలూ అభిప్రాయాలూ ఆదర్శాలూ మనకు యిచ్చిపోయాడు. వాటిని మనం బాగా ఉపయోగించుకోవాలి.

ఋషిధర్మం వర్ధిల్లుగాక!

